

శ్రీరస్తు.

# విభాచారి శతకము.

గీ॥ కరములుజోడించి కవుల కెల్లను మ్రొక్కి । కవులకన్న బిడ్డ కమలరాణి । కవులసమముజేయ కరుణింపుమని నాదు । కన్నతల్లి యిదియే విన్నపంబు॥ ౧. గీ॥ పతిభక్తిగలయట్టి । పడతులకు నే మ్రొక్కి । పతివ్రతల పాదపద్మముల కెపుడు । సాష్టాంగ మొనరింతు స్వాధీనమైనంత । విభాచారి శతకమున్న వింతు॥ ౨. గీ॥ సతిపోరుగలిగిన పతుల కెల్లప్పుడు । పరముకంటెమిగుల ప్రాప్తమనగ । ఇహముకంటెమిగుల యిల్లుగనుపించును । వల్లనురచిపోను పల్లమదురు॥ ౩. సీ॥ భూములేలుచునుండే భూపతులుతోనైన వైరంబుగల్గిన వాపవచ్చు । దండధరుడువచ్చి దరినినిలచుండిన బండమైకొన్నాళ్లు బ్రతుకవచ్చు । గ్రామాధికారితో గర్వించియుండినా మొండియైకొన్నాళ్లు మెలగవచ్చు । బంధువర్గంబుతో బాధలుగలిగినా బహువిధంబులును బ్రతిమాలవచ్చు । ఆలితో పోరు హరిహరులకైనగాని అలవిగాదనగవచ్చు పైనజనుకైన । ఆలి కాదనగవచ్చు ఆగామిగాని॥ ౪. సీ॥ తనయులపోరు తల్లటించగవచ్చు తలిదండ్రులతో పోరు తరమవచ్చు । అప్పులవారితో నొప్పింపుపడవచ్చు అధికారులతో జబాబివ్వవచ్చు । యిరుగుపొరుగులతోడ వియ్యమందగవచ్చు పీలుదప్పితే కయ్యమాడవచ్చు । వెర్రివాళ్ళకును వుపదేశమివ్వగవచ్చు వేదాంతులను వెక్కిరింపవచ్చు । ఆలితోపోరు హరిహరిఅజునకైన । గెలువతరమౌన గోవిందుకైనగాని । అధములనవచ్చు యెంతేసి అధికులైన॥ ౫. సీ॥ అష్టాంగయోగంబు లభ్యసింపగవచ్చు

ఆగమమతములను సాధింపవచ్చు । షడుశాస్త్రములనెల్ల చదివిచెప్పగవచ్చు వేదంబులను నాల్గువెతకవచ్చు । అష్టాదశాపురాణంబులను నేర్వవచ్చు స్పష్టంబుగా గుట్టుబట్టవచ్చు । బ్రహ్మవిద్యకుబంటు బ్రాహ్మణుడుగావచ్చు సర్వాధికారంబు సలుపవచ్చు । ఆలితోడపోరు అలవిగాదనవచ్చు । దేవతులకైన దివిరాత్రులైన । నిదురకంటికిరాదన్న నిజమెగాని । కల్లనరాదు కరిరాజుకైనగాని॥ ౬. సీ॥ లవణాబ్ధియైనను లవణంబులేకను యీదగావచ్చు యింకింపవచ్చు । యీతరాకనుచాల లోతులోదిగవచ్చు ఘనవృషాయమున గిట్టెక్కవచ్చు । రక్కసిపోదలలో రాత్రుళ్ళబండవచ్చు త్రాడులేకనుతాడినెక్కవచ్చు। కొండగుహాలయందు కాపురంబుండవచ్చు కండితంబుగ యోడనుండవచ్చు । ఆలితోపోరు అలవిగాదనగవచ్చు। హాహాహూలకైనఅసులకైనగాని । నరులనశమాననగుబాట్లు సలువిధములు॥ ౭. సీ॥ అడవితిరుగగవచ్చు ఆకులుమెయవచ్చు వ్యాఘ్రమంబుతోనాటలాడవచ్చు । మూఢగంబులకునైన బుద్ధిజెప్పగవచ్చు పుట్టలుపై తలల్బెట్టవచ్చు । అజ్ఞానులకు జ్ఞానమభ్యసింపగవచ్చు నిప్పులువడిగట్టి నిలువవచ్చు । లక్కబొమ్మలనైన నవ్వించగావచ్చు మట్టివాడకు మరలుబెట్టవచ్చు । ఆలితోపోరు అలవిగాదనగవచ్చు । భువినరులకైన బుద్ధివంతులకునైన । పూర్వకృతమట్లు పృథివిలోపుట్టుగాని । ఆలియనరాదు అది దేవతనగవచ్చు॥ ౮. సీ॥ కొండచలువలు రెండుబండిగట్టగవచ్చు బండలెత్తుక కొండలెక్కవచ్చు । కాళ్లురెండును లేక కాసీకినడువవచ్చు కాలమృత్యువని ఖండింపవచ్చు । కంప్లమూయుచు ముళ్ళకంపపై నడువవచ్చు కమలనాభుని కరుకులాడవచ్చు । కోటివిద్యలు కొదువలేకుండ నేర్వవచ్చు కోటికైనను పడగలెత్తవచ్చు । కూటికిలేకుంటే కుజనులను కొల్వవచ్చు బూటకంబనెనాటలాడవచ్చు । ఆలితోపోరు అలవిగాదనగవచ్చు । దాసులకునైన దాసులతాతకైన॥ ౯. సీ॥ పెండ్లాముతోచాల పెనుగులాడగవచ్చు పెద్దకాసులు మెడనుగట్టవచ్చు । చీరెరవికయుబెట్టి సింగరింపగవచ్చు సీతమ్మయనిపేరు పిలువవచ్చు । కూలినాలియుజేసి కూర్చుండబెట్టొచ్చు మావాళ్లుమంచివాళ్ళనగవచ్చు । ఆకలైనప్పుడే నాశ్రయింపగవచ్చు అన్నంబుబెట్టుమని అ

డుగవచ్చు । అడిగినటువంటిలెక్కలు జెప్పవచ్చు కోపమొచ్చినవేళలో కోరరాదు । భారముగజూడ దూరంబునేగవలయు॥ ౧౦. సీ॥ ఆలితో పోరాటమవనిజనులకెల్ల చెప్పసిగ్గు చెప్పగొప్పతప్పు । చెప్పుకొన్నందున సెగ్గించుటేకాని మెప్పురాదుముందు గొప్పబోవు । సాటివారలలోన చవకౌటపుటయేగాని క్షేమమవ్వున జన్మచేమయవ్వును।నొప్పించుటె మనసు తప్పిచతరమవ్వున । మెప్పుబోయి తిప్పలైనగాని వప్పుకొనికొందరిల్లో । వివిధగతుల వ్యందఱేగాని సంసారబంధములను । అందము నులేక ఆనందపడవిగినది॥ ౧౧ ॥ సీ॥ ఆలిజేసిన నేరమునాన్యుకైనను గాని । వీదిజెప్పగవలెను వివరమొంచి । లవణాబ్ధిలో తెంచ సరులకుశక్యమా । రవ్వగల్గునెడలనవ్వగాని । లోటిపెటవంకకు లోటుముగలిగుండు । పతికిలొంగనిసతి పత్నివతౌన । బుద్ధివెనుకనుగాని పాతరగోతిలో । లోతుతెలియగరాదు లోకులకును । సతిపతులసందు తగవుసామాన్యమౌన । భువిజనులగాని బుద్ధివంతులకుగాని । చూపనరాదు చెప్పగానలవిగాదు ॥ ౧౨ ॥ సీ॥ యెలుకకాటుకినుందు । చిలుకపోటుకిమందు । ఆలిపోటికిమందు అవనిగలదే । గరులందూరాపాడే తిరులనార్పగవచ్చు । ఆలిపోరార్పగా ఆకుగలదే । శతకంటకవిన్యైన సర్వాధికారైన । సతినిబోధింప శాస్త్రంబుగలదె। సభలోనచాతుర్యుడని సాటిచెప్పినగాని । సతిమతికియిత్తైన మతముగలదె । ముక్త్యమునకేమూలంబుతెలసుకున్న । మూలనుంకేటి యాలిచేసూత్రితిప్పు । పడకితీరకపఱువిధంబులను కాదా॥ ౧౩॥ సీ॥ సతులచేకొన్నాళ్లు సుతులచేకొన్నాళ్లు । మతిలేకకొన్నాళ్లు వెతలుజెంది । స్వగృహంపోరుచే సంసారములువిడచి । సన్యాసియోగంబు సంతసంచి । అటయోగముకొంత గటయోగమనికొంత । సిద్ధియోగంబని బుద్ధినిలిపి । తలలుజడలల్లుకొని తరుణులనెడబాసి । తత్త్వవేత్తలమని తపశులమని । యోగదండంబుచేబట్టి యోగులమని । చెప్పుకొనుటకు సిగ్గుచేచింతనొంది। సతినిగెలువక సాంబ్రాజ్యపదవికోరకు॥ ౧౪ ॥ సీ॥ సతిపోరుసైపకనే సంసారములు విడచి । సన్యాసులై దిరుగు సర్వజగము । సతిపోరుసైపకనే సంసారములువిడచి । కాసిరామేశ్వరముల్ కధలుచెప్పు। సతిపోరుసైపకనే సం

సారములువిడచి । భారమని గ్రామంబు దూరమేగి । సతిపోరుసైపక నే
సంసారములువిడచి । కానలందున దిరుగుకానిముక్తి భావమదిగాదుబ్ర
హ్మంబు బట్టబైలు । పోరుబడలేక పొరుగూరు జేరుకొనుట॥ ౧౫ ॥
సీ॥ గయ్యాళిసతియైన గనుడుపతియైనను । గనమురాదు వానిగుణము
బోవు । సర్వకార్యములందు సభమెప్పుగలిగిన । సర్వేంద్రియములకు
సాక్షిగాదు । పగలుచెంద్రునిబోలు పొగగప్పురవిబోలు । కళహీనమగు
వాని కాంతిదోలుగు । వాయువిసరుచునుండే వడిగపారెటిగంగ । కదల
కుండగనుండగలదెభువిని । గనుకతొల్లింటికధలైన కలియుగమున । నరు
లకైనను నరహరికైనగాని । ఆలితోపోరు అనగరాదువినగరాదు॥ ౧౬
క॥ సతికుదరకమతికుదరక । మెతులై జగమంత దిరిగి యోగంబనియున్ ।
కత్రుత్వంబున కొందరు । కండితమనియుండ నుండకపటంబనరే ॥ ౧౭॥
కం॥ సతినిగెలువలేక సాధనమనిచెప్పి । సర్వజగము దిరుగ సన్యశించి ।
సర్వశాస్త్రంములను చదివిచెప్పగాని । అసలుగాదు యాలిపోరు
గనరే॥ ౧౮ ॥ గీ॥ యిల్లుగెలిచినెడల యిహమంతగెలవచ్చు । పరము
గెలువవచ్చు పట్టుగాను । యిల్లాలుయిహముల్లు యిడిపించుకోలేక । వీ
ధులందు వీణపాటలనరే ॥ ౧౯ ॥ గీ॥ ముక్తికొరకనిజెప్పి భుక్తికొ
రకైభువిని । భక్తులనితిరిగేటి యుక్తిగనరే । శక్తిరూపమునున్న శ్రీ
మాయలకుజిక్కి । తత్తరింపలేక తప్పుకొనుటే॥ ౨౦ ॥ సీ॥ సతిపతివ్ర
తయైన సంతసిల్లుటేగాని । సర్వేంద్రియముల సంపుటముగాదే । సంసా
రసౌఖ్యమని సంతసిల్లుటేగాని । సాకారముకు చాలాఆనిగాదా । తల్లి
దండ్రులుయనుచు తనవినెందుటేగాని । తల్లికిందులబుట్ట తప్పుగాదా ।
బహువిధములైనట్టి బంధువర్గంబన్న । బాదమీాడిన వెనుక బంట్లుకాదా ।
వచ్చిపోయెటిత్రోవలో ముచ్చువాండ్ల । ముచ్చుదెలిపెటివారి నేగచ్చు
నైన । నతుకవలెననుచు వయిరాగ్యభారములను॥ ౨౧ ॥ కం॥ అక్క
రత్రోవలుకొందరు । మక్కరచే తిరుగుధరను మార్గంబనియున్ । చ
క్కగసద్గురు పదములు । నిక్కంబనికొందరిలను నిజమేదనగా॥ ౨౨॥
సీ॥ సతులవిడనాడినా సుతులనెడబాసినా । సాదనంబదిగాదు సంచితం
బు । సంసారమిడిచిన సౌఖ్యముల్ మరచిన । సాధనంబదిగాదు సంచితం

బు॥ యోగముల్ బట్టినా మోహముల్ వదిలినా। సాధనంబదిగాదు సంచితంబు। దేహముల్ మరచినా దేశ్యముల్ దిరిగినా। సాదనంబదిగాదుసంచితంబు।సాదనంబనగ సాధించె నేర్పుగలుగు। సద్గురువులనగ సంసారబంధములను। అందమునులేని అనందపదవినొంది॥౨౩. గీ॥ వృందురటయుర్వి లోపల సందులుసాధించెనేర్పు సాధనమనియుఁ। గ్రంధము లెరుగనివారలు। కందురు తమలోనె తామె తొందరలేకఁ॥ ౨౪. కం॥ విధములు తెలియనిచదువులు। చదువరిమైకొంతమంది సామంతముచే। శ్రీమంతులైనవారలు। యేవంతునన్నై నగాని హెచ్చుగనుండుఁ॥ ౨౫. కం॥ గచ్చులచేతనుకొందరు। హెచ్చుగబలుకులును బలికి పెచ్చులువేయఁ॥ ముచ్చులుమై ధరలోపల। చచ్చుగ నుండేటివారి సంగతిగనకా॥ ౨౬. సీ॥ చావు పుట్టుగరెండు సందునుదెల్పితే। సద్గురుండనుడి సందేహమేల। విఘ్న పూజలయందు వివరముదెల్పితే। సద్గురుండనుడి సందేహమేల। మంత్రార్చనలకుంజె మర్మముదెల్పితే। సద్గురుండనుడి సందేహమేల। విశ్వమందున్నట్టి వివరముదెల్పితే। సద్గురుండనుడి సందేహమేల। నీవు నేనునుగాదన్న నిజముదెల్పి। నీలవర్ణుడులేడన్న నిజముదెల్పి। మూటిపైనున్న దేమిటో ముఖ్యమనుచు। సైకజేసినవాడు సద్గురుడునన రే॥ ౨౭. గీ॥ వేయువిధముల వేదాంతమనగదీని। వెర్రిభ్రమజెంది వేలు కోట్లనగభువిని। వెతలుబడలేక కతలుగా కలదిరుగుటే॥ ౨౮. కం॥ మన్ననజేయని యాలిని। మర్యాదకు లోభమనుచు మాటలచేతఁ। బూటకమాడుచు పూటకు। రేటుకిసరిపడగదెచ్చి రేయుంబగలుఁ॥ ౨౯. కం॥ ఈరీతిని యీయుర్విని। యేరీతియునైనగాని యేమనలేకఁ। సతిపోరుకి సందేహముకలదా కమలజుకునైన కలలోనైనఁ॥ ౩౦. కం॥ ధర్మములను మర్మములను। కర్మలు కర్మములుయిట్లు కలియుగమందుఁ। కలకాలమునను జరిపే। కడజన్మకు కాంతపోరు కరిమకరన రే॥ ౩౧. కం॥ చర్మపునాటకమిదియని। కర్మోపగతులకుగాని కాయము స్థిరమా। గానలకేగుటమేలని। జాలముజరిపేరు కొందరనరేజగమ్ముఁ॥ ౩౨. కం॥ విధములు అన్నియుసున్నని। వివిధల విడనాడిపోయి విధికృతమనియుఁ। తడబడకను కుడియెడమల। నడు

వడిగన్నట్టివారే నరనారాయణుల్॥ ౩౩. కం॥ పతిమాటకు జవదా
టని । సతివిడచాడి నను తప్పున్న అదితప్పా। తప్పొప్పులుయీతుప్పరు।
మెప్పులు యావత్తుముప్పుమేదిని గనరే॥ ౩౪. కం॥ సతికుదరని
సంసారము మతి కుదరనిమాటవలనె మహిలోగనుడి । స్మృతిలేనిపాట
బోలును । పతులుయెతులైన తప్పువెతకినగలదా॥ ౩౫. కం॥ పతి
యాజ్ఞకుమీరినయెడ । సతిసంసారైనగాని మెతియననచ్చున్। బిడ్డలు
పదిమందైనను । గొడనివిడనాడవచ్చు సాధ్వులుమైనన్॥ ౩౬. కం॥
ప్రారబ్ధంబనెఫలములు । పట్టుగధరనరులనెల్ల పట్టిప్పునని। గుట్టునుదెల
సినవారలు । గట్టిగనే నమ్మమన్న దిట్టముగనరే॥ ౩౭. కం॥ హరి
హరుల కలవిగాకనె । అవతారములెత్తెననుచు అనగావినరే । సురుల
కు నరులకువశమా । పరిపరివిధములను మనసు ప్రచురించుటయే॥
౩౮. కం॥ యాజ్ఞమీరినయాలి నడవిగాభావించి । సాధుజనులపొం
దు సంగ్రహించి । సరసమెరుగక పోతే । విరసమైననుగాని ధరణిని
సన్యాసి దాసపోషా॥ ౩౯. కం॥ సద్గురునిసైకగానక । షడ్గుణములన
ణచలేక సంసారముల౯। సతిపోరుకోర్వలేకను । సర్వంసర్వేశ్వరనుచు
సంచారముల౯॥ ౪౦. సీ॥ సతిపోరుకోర్వక సన్యాసిలౌగాని । సా
కారమిడచేటి సాధనేది । సతిపోరుకోర్వక స్వగృహంబిడుగాని । సా
కారమిడచేటి సాధనేది । సతిపోరుకోర్వక సంసారమిడుగాని । సాకా
రమిడచేటి సాధనేది । సతిపోరుకోర్వక సాధులవుటెగాని । సాకారమి
డచేటి సాధనేది । పోరుగాకను సతినోటి పోటుకెరచి । తోటివారిత
సరిమాటలాడవెరచి । వూటకూళ్ళకుబోవగా వూరుకెరచి॥ ౪౧. సీ॥
సాగనిబ్రతుకులో సతిపోరుగలిగినా । సాధువేషముకంటె సరసమేది ।
అప్పులవారిచే నొప్పిగలవేళ్ళ సతి । కప్పగంతులకంటె కరువుయేది ।
స్నేహధర్మములచే చెలగుచుండెడివేళ్ళ । పిలువసాగినసతి ప్రియముయే
మి । పలుమారుకొకమారు పలుకనిసతికంటె । ప్రారబ్ధమనుకంటె
ఫలితమేమి । అవురసంసారి సౌఖ్యంబు లౌక్యమిదియు । స్త్రీలుకుద
రని పురుషులు సిగ్గుయేమి । చెప్పవచ్చును శ్రీహరిచిత్తమదియు॥ ౪౨.
కం॥ వ్యభిచారి సతిమైన । యేమిగాదనవచ్చు వ్రతచారిమైన

తన వ్రతఫలంబు । విభాచారితోడయీాద సామాన్యమా । నరుల సురు
లకైన అరులకైన ॥ ౪౩. సీ॥ సతియుగయాల్కైన సంసారముకుహాని
సామాన్యముగసభాస్థానిగాడు । కవియైన చవియైన కలగన్నవాతఁలే
కాని కొనసాగదా కాపురంబు । లక్షాధికారైన భిక్షాధికారైన లక్ష్య
మెరుగనిసతికి సౌఖ్యమిదియె । వీధిజెప్పగబోతె వివరమెంచగలేదు
ఆలిచెడ్డదిసన్న అసలుతప్పు । యిట్టివారలకీజన్మ గట్టితప్పు । గుట్టుతెల్పె
టిగుణులచే వినకతప్పు । యెట్టులైనను సంసారమట్టులైన॥ ౪౪. సీ॥ ఈ
తరాకనుచాలా లోతులోదిగవచ్చు కాసులేకనుకాసి బోవవచ్చు । యి
ల్లాలురవబెట్ట యిల్లుకాదనవచ్చు కల్లగాదనవచ్చు కలియుగంబు । స్వ
గృహంబును కొండ గుహాముగాగనవచ్చు వ్యాఘ్రమున్నట్లు వ్యాపించ
వచ్చు । గ్రంథకర్తయినను గంధుగాగనవచ్చు గంగతోసమముగా గా
నబడదు । అవుర గృహరాణి పతిపాల గ్రహాముగాని । యెంతచనవరి
యైన యేవంతునైన । చింతలేగాని శ్రీహరి చెంతయానా ॥ ౪౫ ॥
సీ॥ వ్యాధులరువదియారు ఔషధంబునుగలదు అనుపానమునుగలదు
అంతకంత । పత్యంబుగలదు అపుపత్యంబుగలిగితే ప్రాణభంగంబని ప
లుకుదురిల । యీావ్యాధికేమందు యీాలోకమునలేదు యేలోకమున
లేదు యెంచిచూడ । దివిగాక రాత్రుళ్ళు దీపముండగవలె యీావ్యాధి
దీపంబు ధిక్కరించు । వ్యాధిగనరాదు వ్యాపకంబద్భుతంబు । చూడ
కనరాదు యేమందు సుందరంబు । అవుర సౌఖ్యంబు లౌక్యంబు అంద
దెందు ॥ ౪౬. సీ॥ బిడ్డలుగలతల్లి గొడ్డురాలనవచ్చు సొడ్డులుయేవేళ
సొబగుజేసి । కన్నబిడ్డలుయందు కరుణలేకను బూతులాడుచుండెడితల్లి
భూతరాలు । పలుమారుబిడ్డల పల్చగాజూచిన పాపిగాదది ముందు పా
ముగాని । గుణహీనులైనెడల గుణముదెల్పగలేని తల్లిగాదదితొల్లి ము
ల్లుగాని । కల్లలోకంబు అల్లకొల్లారమిట్లు । సతులుకుదరని సంసారబ్ర
తుకు లిట్లు । మతులు చెడిపోయి మహికొంద రెతులుగదరె ॥ ౪౭.
సీ॥ మగనితిట్టినయాలి మర్యాదలోకేమి ముష్టిచెట్లను తీపి ముందుగల
ద । భల్లూకమునుదెచ్చి బంగారమద్దినా బొచ్చుగాకనుదాని భోగమే
మి । గృతము స్వనకముగ్రోల గోప్యమేమెరుగునా మకరంద్రమున క

ప్ప మసలినట్లె। ఫణులకెల్లప్పుడు పాలుబోసినగాని పరగవిషమునుబో
యి ప్రచురమౌన। తిట్టుబోతులనోళ్ళను కట్టతరమ। రట్టుజేసెటిపెం
డ్లాన్ని నెట్టతరమ। అట్లునాగాక జగమంతనిట్టులాయె॥ ౭౮. కం॥ సతి
కుదరక మతికుదరక। యెతులై జగమంతదిరుగ యోగులమనియున్।
జోగులమని భోగులవలె। భోగములను వెళ్ళమార్చ బొంకులు కొం
దర్॥ ౭౯. కం॥ సతికుదరని సంసారము। సన్యాశనవచ్చుగాని సం
దేహంబా। మతినిలిపి మార్గమిదియని। గతిపూర్వపుదసుచుచింతా నె
తలనుకొందర్॥ ౮౦. కం॥ సతిసుతుల వ్రతముకుదిరిన సతతముగాది
దియుమిగుల శాశ్వితమేదో। హితవుగ మతిగనువారలు। సర్వము స
న్యాసియనుచు చందముకొందర్॥ ౮౧. కం॥ అంధులు ధరచిందులు
సతి। బంధులవల నీదలేక బంధములోనర్। గంధులుబొందుచు కొంద
రు। సందులుగనలేక పంచశరముకొందరు॥ ౮౨. సీ॥ ముక్కోపియా
లితో ముప్పుతిప్పలుకంటె స్వగృహంబిడచుటే సాధనంబు। మూతి
త్రిప్పులుబడుచు మూలనుండుటకంటె స్వగ్రామమిడుచుటే సాధనంబు।
పండ్లుకొరికెటిసతితో పవ్వళించుటకంటె సన్యాసియోగమే సాధనంబు।
పతిపిలచినప్పుడే పలుకనిసతికంటె సౌఖ్యముల్ మరచుటే సాధనంబు।
సతిపతులసందు సంసారసాగరంబు। యితవుగనలేక యిహామందు విద్య
లన్ని। యెతులమన్నట్టివారిని వెక్కిరింతా॥ ౮౩. సీ॥ పతినితిట్టినయా
లి పాముతోసమమండ్రు సుతులతిట్టినతల్లి నూకరంబు। యిరుగుపొరు
గులతోడ యితవులేమెరుగక వీలుదప్పితె పతికి యింటిపోరు। యె
చ్చుతగ్గులు యెంతమాత్రమెంచగరాదు యాలిమాటాననక వీలులేదు।
గొప్పదానవురాల గొందిలోనుండుమని మెప్పుమాటలుచెప్పి తిప్పుకొ
నక। తప్పదిది పతికి తల్లక్రిందైనగాని। భ్రమలునొందిన సంసారిబంట్లు
కిట్లు। యెంతచనవరులైన వేదాంతులైన॥ ౮౪. సీ॥ అందచందము
గాదు ఆనందమిదిగాదు అగచాట్లుబ్రతుకులకు అతుకులివియు। అర్థా
నుభముగాదు శబ్దార్థమిదిగాదు అర్ధశతకంబిది యన్యులార। మెప్పు
కొరకునుగాదు ముప్పుతిప్పలుగాని శక్తికొలదిగముందు ముక్తిగాదు।
వేదాంతమిదిగాదు వెక్కిరించుటగాదు వినుడువిబాచారి విధములిట్లు

అపుర సన్మార్గ దుర్మార్గ ధర్మమార్గ । మార్గములుగనక మహిలో
న మహిషమువలె । వింతకాన్నాళ్లు స్త్రీలచే చింతలివియు ॥ ౫౫.
గీ॥ యిట్టితెరవుగల్గు యెట్టివారైనను । పుట్టిగాని యికను పుట్టనట్టి। గు
ట్టుదెల్పుగురుని మట్టుగాచేరితే । రట్టుమాని కొంత దిట్టమవును॥ ౫౬॥
గీ॥ విభాచారితోడయిాద సంసారంబు । పాముకప్పగరువ పామరంబు।
సారమెరుగలేక సంసారమిడలేక । సానలేని కత్తి సాధనంబు ॥ ౫౭ ॥
విభాచారి లక్షణం. సీ॥ మగనితో కలహించు మర్యాదలోపించు
మగవారుకంటెచ్చు మాటలాడు । యిరుగుపొరుగులతోడ హితవేమె
రుంగదు యింటివారికిపోరు యిందుజేయు । అత్తమామలనత్తి మొత్తు
చుండునుసదా చుట్టాలనేవేళ తిట్టసాగు । కష్టమెరుగదుప్రజల యిష్ట
మేమెరుగదు తగవుజెప్పుటనుమహా తద్వ్యారాలు । పతినిదూషించు నే
వేళ పంట్లుగొరుకు । యెదరుమేలోర్వజాల దేవంతునైన । రవ్వతాజే
యు పతినెపుడు గర్వజేయు । మగువసంసారియైయున్న మార్గమదియు॥
౫౮. వ్యభిచారిలక్షణం. సీ॥ పతినిజూచినవేళ పండ్లువికళించుసు ప
రమాత్ముడనిపేరు పలుకుచుండు । భూషించునేవేళ దూషించుమదిలో
న భాషించువేళ తా బంటుయౌను । మూతిద్రిప్పుచునుండు మూల్గు
చుండును అన్యపురుషులందున చాల ప్రియముతోడ । పట్టుగాసంసార
మట్టుతెలియదటంచు గుట్టుగాపతితోడ గొణుగుచుండు । యిరుగుపొ
రుగులవారితో యిష్టముగను । కష్టసుఖములయందు తా కర్తవలెను।
నష్టమైనను పతిసతికి స్వష్టమనుచు । మాటలోల్లనె దాటించు మగున
యిట్లు ॥ ౫౯. వ్రతచారిలక్షణం. సీ॥ పతియమాయకుడైన సతి
సౌఖ్యమొనరించు సంచితంబనుమదిని చంచరించు । యెడ్డెవాడైనను
గుడ్డివాడైనను నడ్డివాడైన నానాథుడనుచు । లోకసౌఖ్యములందు న
మ్మకంబెరుగదు నరజన్మ మీాజన్మ నలువిధములు । పతినిదూషించదు
పరులనిందించదు పలుమారుప్రాప్తమని పలుకుచుండు । ఆదినేజేసుకు
న్న నాదనుభమనుచు । పాదుగా నెవరుభక్షింప పాలులేదు । తప్పది
దియనుచు యికముందు తిప్పలనుచు । తప్పుకొనితిరుగు వ్రతచారి ము
ప్పులేక ॥ ౬౦. పతివ్రతాలక్షణము. సీ॥ పతికెదురునిలువదు పలు

కదు పరులతో సంస్థాపికలింపదు పద్మినదియు । ఆహారస్సైనముల్ అతి సౌఖ్యమొనరించు లోకధర్మములన్ని లయము జేయు । గుణములన్ని యుదీసి గణితంబుగా జేయు ఘనము జేయును సభాఘనుని జేయు । అంద మంతయుజూపి ఆనందమును జేర్చి ఆకారమునుమార్చి దదియుఅదియె । ముక్తికాంతదదియె ముముక్షు మూలమదియె । పతులగతులనువప్పించి పరముజూప । శక్తిరూపములున్న శ్రీలు స్త్రీలివియె । తత్త్వమైన ధరలోన భుక్తులకును॥ ఉ౧. సీ॥ పాతివ్రతులనెంచ పరుల శక్యమా సురలకుశక్యమా సుంత్స్రపదియు । హ్రాంకారప్రణవంబు జాంకారమనవచ్చు ఆంకారమనవచ్చు ననసియంము । సాకారమునను న్న సోకారమునుదీసి ఆకారమును జేర్చె అమ్మలదియ॥ భుక్తి భక్తియు యుక్తి శక్తిర క్తులనచ్చు ముక్తినొందించేటి మూలమదియె । అతివమైవచ్చి ధరలోన ఆశజూపి । ఐక్యపదవిని జెందించు అమ్మకమ్మ । పూర్వ కృతిమట్లు పృథివిలో పురుషులకును । జ్ఞానమార్గంబులుప్రాప్తించు ఘను లకట్లు॥ ఉ౨. కం॥ సతీపతి మతికుదిరినయెడ । సందేహము లేక దేహ గేహము రెండుక్ । మోహము పకశైవ్యంపును । యేకాత్మదిద్వయము నందు ఓం ప్రణవంబై॥ ఉ౩. కం॥ సతికుదిరిన పతికెప్పుడు । యితవుగ పరమార్థమునగ యిహమునవచ్చుక్ । ఆహమనవచ్చును అల్లన । కామమునకు కాంతిముక్తి కాంతనవచ్చుక్॥ ఉ౪. కం॥ సతికుదరక సంసారము । హితవేమన కొంతమంది యెతులై పోయెక్ । మతిలేక ను గతిగానక । అతిమాయెదమనుచు అడవులవి మేలనుచుక్॥ ఉ౫. కం॥ సతికుదిరిన సంసారము । యెతులైనాగాని యిహము హితమేయ నుచుక్ । మతికుదిరి మార్గముండరి । సతివల్లన సర్వసౌఖ్య సంపదలందిరి॥ ఉ౬. కం॥ సతికుదరని సంసారము । సన్న్యాసని కొంతమంది సన్న్యాసులంట । సద్గురుని సైకగనుగొని । దుర్మార్గ ప్రవృత్తులన్ని దూరము ద్రోచుక్॥ ఉ౭. కం॥ సతికుదరని సంసారము । సతమేమని కొంతమంది సన్మార్గముచే । సాధులుమైనను ధరలో । సంసారము యుదియటంచు సంతోషముతో॥ ఉ౮. సీ॥ సతిసుతులుచుట్టాలు మ ట్టుగాకుదిరనా గుట్టయినగురు సేవ దిట్టమనుచు । సర్వశాస్త్రములందు

చదువ నేర్పరియైన వేదాంతమన్న దే యెక్కువనుచు । అష్టయోగము లందు శిష్యులు నేర్చినా పుట్టిగిట్టడమందు గిట్టదనుచు । షణ్మతంబులయందు సాధుపు నేర్చినా ఓంకారమునుదించే సాధనసుచు । వెతుకుచుందురు వెయివేలగతులనైన । యిహము పరముకు యిహద యివ్వగోరి । రవ్వయుంతైన తనబ్రతుకు గవ్వనైన । సున్నవలెనుండు ధరలోన మున్నవలెను॥ ౬౯. కం॥ యోగులు భోగులుగాతను । భోగములను నున్నవారి బోధలు యిటులన్ । రాకపోకలియుగునుగ । ఆకలితోనున్న గాని ఆనందంబుల్॥ ౭౦. గీ॥ మానమందునబుట్టి మానవుండై పెరిగి। మానమందున్నట్టి మర్మమే నెఱు। మానపువనకొకసారి మార్గమని దెలిపినా । మాయ తెలియలేక మనుతవలసి॥ ౭౧. గీ॥ మానుమానుబట్టి మర్దించినంతనే । మన్ను మాను దాని మర్మమేమి । తనువు తనువుబట్టి తరచినవల్లనే । తనువృతనుగునను తరచవలెను॥ ౭౨. గీ॥ తరచగల్గువారు తత్వవేత్తలునైన । తరముగాదు చెప్పతరముగాదు । ఆటబూటకమన్న నాటకంబందున । మాటలన్ని మాట చాటుగాన్॥ ౭౩. కం॥ గాలము బెండును చూచుచు । మీనము పడలాగినట్లు మేదినిలోనన్ । సోహం సోహము జేర్చెటి । సాహసులై యున్న వారి సాధనయిట్లు॥ ౭౪. కం॥ వాదము భేదము చేతను । సాధనమని కొంతమంది సాగరమందున్ । మీనము గ్రాసములిచ్చియు । ఆరము లేకుండగానె అటుయిటు దిరుగున్ ॥ ౭౫. గీ॥ నాసికాగ్రరలో ని నాసనైయుండినా । బ్రహ్మపూజజేసి భ్రమలునణచి । ఆత్మపూజజేసి ఆయుష్యంబుగావలెను । ధరణిని సన్యాసి దాసపోష ॥ ౭౬. కం॥ భక్షణకొరకై భిక్షము । రక్షకుడని పేరుజెప్పి పక్షము లేకన్ । శిక్షించ మదిగన లేకను గృహకక్షకులైనవారి గుంపులుగనరే॥ ౭౭. కం॥ రుద్రాక్షలు మెడ నేసుక । రుద్రునిపలుమారు దలచి భద్రముగానే । చిద్రూపమెరుంగ డెమర్మము। అగ్నులు గన నేర్చినట్టి పెద్దలునను నా॥ ౭౮. కం. సన్యాసి యోగమైనను। సంసారము నందుగాని సాగరనున్దన్। మీనము మసలినచందము। గాలము చేజిక్కికుండా గన్యతగనుమీ॥ ౭౯. గీ॥ గ్రంథకర్తాయని క్రిందుజేసినవారలు। నిందలాడినిజము నిలుపలేక। పాండుగాధరలోనఅందమంతయుకోలుగ। అం

దుశ్లై రినంతే యుండునంటి॥ ౮౦. గీ. ఖ్యాతికొరకునుగాదు కవిజెప్ప
టిదిగాదు । కమలనాభుని మహిమ కానలేక । గోతబెట్టువరకు గోవిం
దునామంబు । యుందు శాయదలచి యుందునంటి॥ ౮౧. గీ॥ మరువ
లేకహరిని స్మరణ జేయుటగాని । స్మరణ జేసినందు పరము లేదు। పరము
కంటెమిగుల పైనున్న దని పెద్ద । లనగవింటిగాని కనుట లేదు॥ ౮౨.
కం॥ గాలముచిక్కని మీనము । సాగరమున దిరుగలేదా సంసారము
లో । సాధులు వుందురటందురు । సన్యాసులునైనగాని సార్థకమేమి॥
౮౩. కం॥ గాలముచిక్కని మీనము । సాగరమున సంచరించుచుంద
ముగానే । సాధులు సంసారములో । మాయకులకు చిక్కనట్టు మర్మ
ముగనరే॥ ౮౪. కం॥ తప్పులు వెతుకుచు కొందరు । తప్పారు వేషము
లుచేత మెప్పుగధరలో । వప్పింతురు నొప్పింతురు । కప్పలవలె మాట
లాడి కడదెరుగరనిరీ॥ ౮౫. కం॥ కడజన్మపు కాయంబని । కడసార
పుబిడ్డ వలెను కమలభవునకున్ । కలదెరగు లన్ని విడచియు । కడమా
టలు వెతుకమనిరి కలయిలనైనన్॥ ౮౬. కం॥ తప్పొప్పులు యీ
తుప్పను । మెప్పులు యావత్తు ముప్పు మేదినిలోనన్ । అప్పులురొప్ప
లునైనను । తిప్పలు ననరాదు ముందు నొప్పులుననిరి॥ ౮౭. కం॥ ఆగా
మి సంచితంబగు । ప్రారబ్ధపు ఫలములందు పక్వంబనిరి । హరిహరుల
కలవిగానిది । ఆకారముపుండువరకు అనుభవమనిరి॥ ౮౮. కం॥ మురు
గులు మురిడీగొలుసులు । మృదువుగ మొలత్రాళ్ళు వేసి ముందటికొర
కై । మాటలునాడించుటకే । పాటలువాటముగ పాడ నూటిదినిరి॥
౮౯. కం॥ రామాయని వకమారును । రాజసమును విడచిమదిని
రంజిలుచు నే । కామిని సెరములుకట్టియు । తామసమును లేనివారు
ధరతత్త్వవిధుల్॥ ౯౦. కం॥ మానవుడై మహిపుట్టుచు । మాధవు
డనలేకమదిని మార్గముగనకన్ । మాయకులోబడి తిరుగుచు । మగు
వల మమకారములను మానములందున్॥ ౯౧. కం॥ భక్తికిభూము
లుదిరిగే । భక్తులుబహువిధములైన భావంబాకరి। యుక్తాయుక్తము
లెల్లను । ముక్తులకేగానిదాని మూలముమనసా॥ ౯౨. కం॥ కాయ
మెన్నాళ్లైన కడమొదలుకనరాదు । కాయముకాయమూకర్మగాని ।

మర్మమెఱుగక మహిని మాటలాడుటే గాని । చర్మనాట్యమనుచు చెప్ప
లేదా॥ ౯౩. గీ॥ తోత్రలు ముత్రికి చిత్రులు చీకాకు । చిగ్గుకానలేక
యొగ్గులాడు । తగ్గియున్నవారి తత్వంబుగనలేక । ధరణిని సన్న్యాసిదాస
పోష॥ ౯౪. గీ॥ పదునాల్గుతోత్రముల్ పరమాత్ముఁడుండెనని । పలు
కుచుండిరి వినవె పలువిధముల । కరినిగాచినవాని కపటంబుగనలేక ।
కాలమంత జారె మాయ ననవె॥ ౯౫. గీ॥ గారడీవిద్య జగమిద్యగట్టి
గాను । మట్టుగా గురుని గట్టును బట్టువారు । రట్టులేనట్టి బ్రహ్మంబు
బట్టునటవే॥ ౯౬. గీ॥ ఆడదానికిబుట్టె నఖిలజగంబులు । ఆడదనగ
జాడ యాడదనగ । యీడపింగళపైన దోడుగానున్నదే । జాడగన్న
వారి జన్మసున్నా॥ ౯౭. కం॥ లతలుగలిగిన కుక్షికె । చెక్షులుశో
భస్కరంబు సొంపుగగనవే । అక్షయము కాదు కాదని । పక్షీంద్రుని
బాటులిట్లు పలికిరి వినవే॥ ౯౮. కం॥ నీవన్నది నేనన్నది । నీనామహ
త్మ్యమును వశమా నిజముసుకన్నా । అన్నది విన్నది కన్నది । సున్నా
యీమూడుబడి కన్నాలన్నా॥ ౯౯. కం॥ భావము దెలియని భజ
నకు లోహపుతాళాలుయెన్ని లోటేమన్నా । భావముదెలసిన భక్తు
లు । సోహము మదిగన్న వెనుక సొంపేమన్నా॥ ౧౦౦. కం॥ బంగార
ము కంగారె । శృంగారము శాయమవలసి సుతులచేతన్ । లొంగినపిమ్మ
టజూడగ । వెలిగారముచేత దాని వెలపోచ్చాయెన్॥ ౧౦౧. కం॥
అద్దపుపైరంగులచే । సిద్ధంబైనట్టిజ్యోతి సోద్యంవలెనే । సిద్ధినిబొందిన
వారల । బుధులువివరింప వశమ భువి నరులకును॥ ౧౦౨ కం॥ పె
ద్దలు అద్దులుదెలియక । పెదపెద్దవి మాటలాడి పెద్దలమనుచున్ । సు
ద్దులుజెప్పెటివారల । బుద్ధులుబోధింప వశమ బుధులకునైనన్॥ ౧౦౩.
కం॥ అప్పావేగ మెరమ్మిక । తప్పకునను గావనికు చెప్పగ లేదా । మెప్పుకిగాది
దినొప్పికి । తిప్పలుబహుచుంటి కాళ్లుతీపులచేతన్॥ ౧౦౪. కం॥ కాయ
ముపుట్టిన వెంటనె । మాయనుపుట్టినది మదిని మార్గముగనకన్ । మాట
లునేర్చితి మహిలో । కూటికేచనిపోతే వలాకాటికేరామా॥ ౧౦౫.
ద్విపద. వినుడినరులార యీవిశ్వంబునందు । అరనూరుపై నాలుభాష
నేర్చి । షడ్భావములచేత షణ్మతంబులను । అష్టయోగములనే నిష్ఠలు

చేత । సర్వేశ్వరుండనెటి సందుదెలుయుటకు । సాధులమనికొంత స
న్యాశులనియు । సద్భక్తులనికొంత సద్గోష్టియనుచు । సతిసుతులపో
రుచే సమభావమనుచు । కాషాయవస్త్రాలు కొమండలములు । యో
గదండంబులను యోగులనికొంతా । జోగులమని సంకజోలెలనుకొంతా
పెద్దలుమనికొంతా పెద్దవేషములు। గురువులనునికొంత గురుతులిడుమ
నుచు । అనేకధులుదపనికొంత ఆనందమనుచు । సభమెప్పగలయట్టి సర్వ
శాస్త్రములు । చదివిజెప్పచుకొంత సంతోషములను । సంస్కృతంబని
కొంత సభలంమచాటి । వేదంబులనికొంతా పెక్కుమాటలను ।
కొవ్రులమనికొందరు । కలదిరుగుచుండు । పుదరపోషణగాని కుమారుట
దిగాదు । చదువ్రరిగసంసార చంచారమనియు । వేదాంతమనికొంత
వెర్రిబ్రమచేత భద్రమెరుగనిగురుని రుద్రుడనిచేరి । క్షుద్రలనుగని మ
హిమదమెుందికొంతా । సద్యజపములుకొన్ని సాధనములనియు ।
మంత్రంబులనికొన్ని మర్మమనిజెప్పి । అచలపరిపూర్ణబున అసలయిన
వనుచు । తారకంబనిజెప్పి తంతుజరుపురురు । చిత్కళలుజూచి చిన్మ
యుడనుచుమదిని । ఆనందమేగాని అసలదియుగాదు । నామరూపక్రియ
లు లయమనుచుజెప్పి । నారాయణుండంటే నరుబాధ్యగాకా । నామం
గలవాడు నరహరియనుచు । నాట్యమాడుచునుండే నగరమిదియనుచు।
కనలేకఅనలేక వినలేకజనుచు । కలకాలములంయున్న కలియుగంబనుచు।
కడతేరుచుండు యీకర్మ కాయములు । కడదెలియకనేయుట్టి కర్మబం
ధంముల । చిక్కినిక్కు చేసుండు శ్రీహరియనుచు । జగమంతయీరీతి
జరుపుతేగాని । జన్మమెుల్లనిబాడ జారలేరనుచు । అన్నలెరిగిన పెద్దల
సగనేవింటి । సుద్దులేగాని నేనద్దు తెలుగనుగా । గద్దరింపగ వద్దుగనులె
వరువిన్నా॥ ౧౦౯. కం॥ సన్యాశిదాసుడీ । శతకంబుజేసేను మెప్పగా
దు చూడతిప్పలివియే । అప్పుజేసిపెట్టి చప్పసాతర్యాత । విభాచారిశ
తకమింతపింతా॥ ౧౧౦.

విభాచారిశతకం సంపూర్ణము.

## తత్వకీర్తన - ఆదితాళం.

చూడాబోదాము రారోయమ్మా దొరలుండేరయిలుబండి చూతాము రారోయమ్మా॥ చూ॥ బండినిగనవలె భావములోపల కొండల పొడవున వుండినపాపము బండలుపిండయినట్టుగోవునట॥ చూ॥ ఆగామనుయే రోడువేసిరట భ్రమయనియే పట్టాలువేసిరట దుష్కృతమనియే యిస్కార్లు బెట్టిరట సుకృతమనియే పిలపవేసరట॥ చూ॥ సంతకర్మలనే స్టేషనులుండట వాక్కుకర్మ యనే మేష్టరులుండట యిచ్చినమట్టికే టిక్కెట్లిచ్చుట॥ చూ॥ యిచ్చిన మాత్రమే దూరమునిచ్చుట యెచ్చుడిగితే నిన్నెక్కనివ్వరట తప్పుడుపనులకు కావులుందురట॥ చూ॥ జన్మకుమిగిలిన ప్రారబ్ధమనె మూటగట్టినీ వెంట బెట్టుటకు గూడు ష్టేషను లేర్పరచిరట॥ చూ॥ నాదికాదు యిది నీదేయని వకప్యాసు జేసినీచేతికిస్తురట పోయినదూరము వెంటవచ్చునట॥ చూ॥ కాసీయనియే శివస్థానమట రామేశ్వమనే హరిస్థానమట భ్రమవీడక యీనడుమనేదిరుగట॥ చూ॥ బండిచూడగా బహుసొద్యంబట యీషణాదులే యినుసులాయెనట తాపత్రయములు తలుపులాయెనట॥ చూ॥ ఆశంలనే బెంచిలువుండునట నడతజూచుటకు డిబ్బీలుండుట గుణములనే లెట్లుప్పుండునట॥ చూ॥ బండగుణములనే బిరాకులుండుట కాయకర్మయనే గార్డువుండునట వెనుకనుండి తనుముందుచూపునట॥ చూ॥ ముందుబండినీ ముగ్గురుదొరలట విష్ణుయీశ్వరబ్రహ్మవారలటపంచభూతములు ప్రబలినబండిట॥ చూ॥ నిప్పునీరనివాయువచేతను దూరముకొలదిగ భత్యకర్చని బొగ్గును వెంటను బెట్టుకునుండుట॥ చూ॥ యికపొమ్మని గంటనువాయించట దోవచూడుమని శికినివాల్చునట అడ్డులేదని గేటులుండునట॥ చూ॥ కిన్నెరస్వరముల కేక వేసునట బండిగదలితే దణదణ గణగణ జణజణలాడట గప్పుగప్పునట॥ చూ॥ యీడపింగళనె నాడులుపక్కనె రాకపోకలు రమ్యముగానె తాళముమద్దెలతళంగుతది

గిణ తాకిటకిటకిటి ఝంకృతఝంకృత ఠాంగుఠాంగుమని గంటనాదమట॥ చూ॥ గజ్జలు మోతలు గర్జిలుచుండట కొండగుహాలు ఘోషించుచుం డునట వ్యాఘ్రసింహాములు బెదరిపోవునట॥ చూ॥ నీవె నేనని నేనేనీవని యెదరువాలును వచ్చేబండ్లను తప్పుగోడ్లను తప్పుకుపోనట॥చూ॥ వాసి గవల్లురునరసింహాచార్యులు బండిచిత్రము బాగుదెలుసునట బండలుకరిగి బిండి జేసునట॥ చూ॥ వారివద్దనే కొలువయివుండిన దాసుమునన్యాసయ్యా నేర్చినా పనులచిత్రము పట్టికష్టమట॥ చూ॥



శ్రీ ర స్తు.

ఇది

సాంఖ్యతారకమనస్కాచల పరిపూర్ణ రాజయోగ నిష్ఠాగరిష్ఠులు శ్రీవల్లూరు లక్ష్మీనరసింహాచార్యులుంగారి శిష్యులు పోతాబత్తుల అప్పలస్వామి వానపల్లి సన్యాశిదాసుగార్లచే రచియింపబడిన

# స హో ద ర స ం భా ష ణ.

## గీ త ప ద్య ము లు.

ముక్కంటిసుతునకు మ్రొక్కనేసాగితి । సక్కజేయుసకల కా
ర్యములను । అక్కరైనపదవి అడుగనేదలచితి । వెతకిబట్టుకుంటి వేడు
కలరా॥ పద్మశాలీలలో పట్టుగాపుట్టిన । వసుధ వానపల్లి వంశమునను।
దాసు సన్యాసివై ధరనుబరగినవలన। ధర్మములనుదెల్ప ధర్మమయ్యా॥ ౧
కపటముడిగినయట్టి కైకాలికులజుండ । నీదువంశమునకు నీతివరుడ।
ధరణుపోతాబత్తు లప్పలస్వామిని । వయ్యనడుగలేదా అంతవరకు॥ ౨
అయ్యవేరనుమాట ఆశమాత్రమెగాని । మొట్టమొదటనుండిచిట్టచివరు
పాదుదెలిపి జన్మ పావనునిగా జేయ । నీవెగాక వేరు లేదు కాదా॥ 3
యెన్నివిధములైన వేదాంతమన్నది । అయ్యవలనువింటే అవునుదృఢ
ము । నాదువలనవింటే నీదుసందేహము । తీరు లేకజన్మతీరదేమొ॥ ౪
అట్టిమాటలువలన అట్టిట్టుశాయకు । అయ్యావలె నిమిమ్ము నాశ్రయి
స్తి । పట్టుగానుజగము గుట్టుదెల్పుమునాదు । గుణముతీర్పవలెను గుణ

రహితా ॥ ౫ ॥ నీవునేనొకటనుచు నిజముమనగురువర్యా। లక్ష్మీనరసిం
హార్య న్యాయమదియు। వేరెమార్గము జెప్పి వెత్తేమిజేసెను। మన
సుభ్రాంతికాని మరియులేదు ॥ ౬ ॥ గురువర్యులొకరైన గురుతువకరై
నను। గుణము వేరుగనుకి గురుప్రకటెటు। నెక్కువనుచుమదిని నిక్క
ముగనమ్మికని। చిక్కుదీర్పవలెను మక్కరేలా ॥ ౭ ॥ మక్కరేలమన
కు మానవజన్మంబు। మహినిపుట్టినందు మానగనెంతకి। అక్కరైనప
దవి నిక్కముగగినవలెను। చిక్కయుంటకాని చిక్కబోదు ॥ ౮ ॥ చొ
క్కియుంటనేను నిక్కముదెల్పుమా। నీలవర్ణ సమము నీవెనిజము।
యితరులెవ్వరైన హితవులుదెల్పినా। హితవుగాదుమదికి హితవు దె
ల్పు ॥ ౯ ॥ హితవేమిదెల్పెదను సతమన్నదేకదా। యిదివరకుగురుని
చే వినకన్న। పున్నెపెన్నెలకన్న పూర్వమున్నదెనున్న। బయలు
చూడబోతె బంధినున్న ॥ ౧౦ ॥ విన్నమాత్రమెల్లా వినులున్నంతకే।
కన్నలున్న పరకె కన్నమద్ర। బట్టలు పెద్ద బంధినున్నన్నదే। గుట్టు
దెల్పుదాని గురుతులెల్లా ॥ ౧౧ ॥ గుట్టుదెల్పుమటనుచు గట్టిగానడిగితే
వట్టిమాటలచేత దిట్టమానా। అట్టిజూడగనీకు వైరాగ్యమేమిటో। అ
డుగవలసియుండు నడుగవలయు ॥ ౧౨ ॥ అడుగవలసినమాట లడుగవ
లెననిగాదు। ముఖ్యమైనమాట మూటచాలు। హట్టువిడుపులేని పది
మాటలెందుకు। దిట్టమైనపదపే దిడవలయు ॥ ౧౩ ॥ పంచభూతముల
ను బరగ ప్రపంచంబు। పంచపంచకములు సంచితంబు। సాకారమున
నుండి సాధింపవలదాన్ని। వంచనంబుగలిగి వసుధయుండే ॥ ౧౪ ॥ వేద
శాస్త్రములెల్లా వెతలనుచు కతలనుచు। మతులుగానకదాన్ని మరిగి
రిసిరి। కల్లశాస్త్రములెల్లా చల్లగాబోధింప। కాదున్యాయమదియు క
పటమేలా ॥ ౧౫ ॥ సరెసహోదరనీకు శాస్త్రసమ్మతములే। చెప్ప
నేల వినువప్పనేల। చేతనైనమాట చెప్పెదనిటుపైని। చేతగానిదేదో
చెప్పవలెను ॥ ౧౬ ॥ స్త్రీసృష్టిపెట్టాయె స్పష్టముదెల్పుమా। కష్టమేల
మనకు కబురులేలా। అష్టయోగములైన సిష్టలేననుచుండ్రి। నష్టమే
మిగాక లాభమేమి ॥ ౧౭ ॥ శాభాషనచిగిలిపి చెల్లునువైరాగ్య। మె
ల్లవింటిని కల్లకాదు కాదు। అడుగుమన్నందునా అడిగినమాటకు। అ

నుభవంబుగలదు అడుగుమికను ॥ ౧౮ ॥ వేదాంతమందురు యేపురూపేమిటో । అట్టిదిట్టిదనుచు అసలుయెరుగ । గట్టిగాను దాని గుట్టుదెల్పుము వేగ । యితరమేమి మనసునుంచబోకా ॥ ౧౯ ॥ వేదాంతమున్నది యేపురూపెరుగను । రాకపోకెరుగడు రత్నమువిధియు । లేనిచపోసదే వున్నదున్నట్లుగా । నిజముదెలుసుకుంట సిసెసిన ॥ ౨౦ ॥ నిజమున్నదెరుగను నీవెవ్వరెరుగను, నేనెవ్వరెరుగను నిక్కమిదియె । మహిమహాత్రుండైన మర్మముదెల్పుమా । మహిమబుట్టిన చా మూగణమేదో ॥ ౨౧ ॥ పుట్టమంటనుగలదు గిట్టమంటనుగలదు । పుట్టకుండగనుండు పుడమియందు । సందుదెలసినవారి ఆనందమేమందు । సంచిలేనిమందు జగమునందు ॥ ౨౨ ॥ పుట్టిగిట్టడమందు యీవరకు నేమందు । విన్నదందును కొందరయ్యలందు । పుట్టకుండామందు పుడమిలో గలనుందు । పొట్టయందు పట్టి పట్టమందు ॥ ౨౩ ॥ అనుపాన పత్యముల్ అందము నడిపితే, మందు యివ్వవచ్చు మాటలేలా । సుందరంబయినట్టి సూక్ష్మవస్తువులచే । కాయమనెడి వ్యాధి కడకుపోలగు ॥ ౨౪ అనుపానపత్యముల్ అందమనేకదా । అనుసరించి మిమ్మునమ్మగవలసె । వివరమంతయుదెల్పి విధికృతంబనబోక । విన్నవరకునైన సున్నకాదా ॥ ౨౫ ॥ అనుపానపత్యముల్ అనునైనశాస్త్రముల్ । కాయమున్నన్నాళ్ళు కర్మకాదా । పెద్దలొద్దనుచేరి బుద్ధివినుమందు । కాయకర్మవిడితే కడదేముందు ॥ ౨౬ ॥ కడదిముందైనందు కర్మయీడౌనయ్య । కాయమీడనెకదా కలియుగంబు । యిట్టిమాటలుగవా పట్టిమిమ్మడిగెదను । యెట్టులైనయికను రట్టుగల్గు ॥ ౨౭ ॥ రట్టులేలమనకు రాజసమణుసుమి । దిట్టమైనపదవి దివ్యముగను । యెట్టులైనగాని యేకోభవించితే । రట్టులేదుదానిమట్టులేదు ॥ ౨౮ ॥ రట్టంటునేగాని రాజసమదిగాదు । గుట్టుదెల్పుమనుచు గట్టిగాను । పట్టిమిమ్మడుగగ పరులెవ్వరున్నారు । దాసులైన నాదుదాతలైన ॥ ౨౯ ॥ సరెసిమ సందేహసంశయంబిడునట్లు । వినుమిచెప్పెద నీగుణీనులార । వేదశాస్త్రములన్న యజ్ఞకట్టెలుచేత । పెద్దలొల్ల బుద్ధిరద్దుయానాను ॥ 30 ॥ బుద్ధిరద్దా నెడల బుధవర్గమైనను । పుట్టబోరుధరను గిట్టబోరు । చెప్పితిరిమీమాట నప్పితిని నామదిని । వి

తలిట్లుదెల్పు చింతలేలా॥ ౩౦॥ వింతచింత లేల విధికృతంబననేల । అంతులేనిజగము నంతులేల । పంతమునను గురుని చెంతజేరి తేజాలు । అంతు దెలసుకుంటె వింత లేలా॥ ౩౨॥ వింత చింతలనగ వితమేమి తెలియదు । వీనులార నాదు విన్నపంబు । మన్నించి నడిగినా మనిషిమాత్రుండైన । మార్గమన్న దేమొ మాటచెపుమా॥ ౩౩॥ వేరెమార్గముగాక వెతలుక తలును కాక । చెప్పెదను నామాట చెవులవినుమ ॥ నేనన్న దేముందు నీవిన్న దేమందు । మందువలనయిందు అందులకును॥ ౩౪॥ మందు నేనెరుగను యిండైనయెరుగను । ముందైనయెరుగను ముఖ్యమొకటె । మనిషిమాత్రుండైన మాటడడిగితినిమిమ్ము । మరవుచెందుటకును మాటలివియు॥ ౩౫॥ అగ్ని బీజంబాయె గంగప్రాణంబాయె । పృథివికాయంబాయె పుట్టగిట్ట వాయువపరమాత్మ । గగనంబుజీవాత్మ అయిదుగూడిఆయె నాయె జగము॥ ౩౬॥ వింతదెల్పితివయ్యా సంతోషమాయెను । అగ్ని బీజంబెట్లునాయె దాని । వివరము చెల్పుమా వినగోరిఅడిగితి । వీనులందు వితవులేమనందు॥ ౩౭॥ విత్తుమారకగాని యిహస్సృష్టిగాబోదు। సత్తుమారకను సాకారమేది । స్వేదవల్లను శ్రీలగర్భమందుననీవు । శిశువు రూపమన్న సిగ్గులేదా॥ ౩౮॥ కరములుజోడింతు కరకంపుడ వెనీవు । గంగప్రాణంబెట్లు గల్గెనయ్యా । వినుకబోకమదిని వుచితముంచగవలెను । విన్న కొలది జగమునున్న గానే॥ ౩౯॥ సత్తు చేవీర్యంబు సాగినవెంటనే । చితుచెబుమ్మదము సొంపుగాను । శ్రోణితంబుపైన శుక్లంబు క్రిందాయె । అందువలన గంగప్రాణమాయె॥ ౪౦॥ శాబాషు చెప్పితిరి సందేహమిడెను । పృథివికాయమెట్లు పుట్టగిట్టా పుణ్యాత్మనాకది । పూని బోధింపు । మాయోనులందు పుట్టయోగమేమొ॥ ౪౧॥ యోనిప్రజాపతులు యాకమైనంతనే, రావుచేజగమంత మోవుగాదా। వావుగానున్న ట్టిధరణికాయముగాక । యితరమేమికలదు వినుమసీవు॥ ౪౨॥ పరమాత్మవాయువసి ప్రచురింపజేస్తిరి । దానిభావమేమి దాసవర్యా । విన్నవరకు కన్నులున్నంతవరకునే । మిమ్ముమినహానున్న వున్న దన్నా॥ ౪౩॥ సర్వజీవులయందు సంచారమైవున్న । సందుగనుమిదాని అందమెల్లా । అగ్నిగంగపృథివి ఆకారమయెగాక । యితరమిదియె అదియెస్వాతమనం

గా॥ ౧౪॥ యేమిధర్మమయ్యా యెన్నాళ్ళు వెతకిన । వేదమనిరిగాని ఆదిలే
దు ॥ మిమ్మునడిగినందు మీరిదిదెల్పుమా । జీవిగగనమనగ భావమే
మి॥ ౧౫॥ అందిఅందనిదైనదందు చేతనుకొంత । రూపుబుట్టిదనుచు రూ
ఢిలేదు । కనికానట్టిది కనులనమనుగదా । కానవలెను దీనిభావమధి
యు॥ ౧౬॥ అయిదు చెప్పితిరయ్యా అయినయ్యా జగమయ్య । యింకొ
క్కటుసిగదను యుంపుగాను । మనిషిమాత్రుండైన మర్మమిదినంటిరి ।
పోతుపెంటి రెండు నేటలేమి॥ ౧౭॥ గగనమగ్ని రెండు గనపురుషరూపం
బు । పృథివిగంగ రెండు పెంటిరూపు । వాయువశరీరంబువాలలాడుటవ
ల్ల । ఆయెనాయుజగము అసలు రెండు॥ ౧౮॥ అయిదుమిశ్రమైన అసలు
యిట్లుండగా । వేరుపాటుగిలిగెనెందుచాత । సందుదెల్పుదాని అందము
ట్లుదోకాని । బందమీడగొట్టి బట్టబయలూ॥ ౧౯॥ కుడిపురుషరూపంబు
యెడమస్త్రీరూపంబు। యిడపింగళిరెండు నాదులవియె। స్వరపరీక్షనుబ
ట్టి చెలరేగినంతయే। గానవచ్చుమంనుకపటమేమి॥ ౨౦॥ వేదాంతమన్నందు
వెతకిమిముగన్నందు। మొట్టమొదటబుట్టు మొలకసందు। అడిగినందునను
దికి ఆనందమైనందు। జగమునందుచూడ జన్మమొందు॥ ౨౧॥ అడిగినందు
కింత ఆనందమేకదా। అడుగవలసియుంటె అడుగుమింక। అడిగినంత చెప్ప
లేనట్టివాన్నైన। క్రోచినంతవరకు క్రొక్కులేలా॥ ౨౨॥ మనిషిమాత్రుం
డైన మర్మముదెల్పితి। రిమహినిబుట్టినందు మార్గమేమి। తిరుగవలసిన
ట్టి తీర్పులు తెల్పుమా। చేయరానిదేమొ చేయుటెమో॥ ౨౩॥ మొ
ట్టమొదటతప్పు మసలుచునున్నట్టి। జీవినిలిన రాదు జీవిగనుక। భ్రాం
టిలేని జీవి బ్రహ్మంబుసమమవును। జీవిలేని భ్రాంతి జీవులెంచు॥ ౨౪॥
పాపపుణ్యములకును పాదుదెల్పితివయ్యా। పావనునిచేయ నాపాదుసేవ।
విభక్తుణలేని జీవెట్లునిలచునో। జీవులందు వేగ జీవులేవో॥ ౨౫॥
జీవులివరము లెంచి విభక్తుణజేసి। జీవినిలుపవలెను జీవనముగ।
జీవినిలిపి వెనుక జీవులగనవచ్చు। జీవిలేనియెడల జీవులేలా॥ ౨౬॥
పంచభూతములను బరిగప్రపంచమని। చెప్పియుంటిరిగదా చెవులవిం
టి। అయిదుగూడివక్కటైన జీవిదిననిరి। జీవిగాకయింక జీవులెన్ని॥ ౨౭॥
స్త్రీరూపమున రెండు పురుషరూపము రెండు। రూపులేనిదివకటి రూఢి

నైదు । విదమువక్కటాయె పదములుమూడాయె । జీవిమూడుజీవులా యెనందు॥ ౧౮ ॥ మూడుజీవులన్న మూలముయెరిగింపు । మూటియం|దునున్న మూలమేమొ । సర్వజీవులుమనుజ నాకారముకులొక్క కాకజీవులనగ కడదియేదో॥ ౧౯ ॥ మసలుచున్నదివకటి మసలుకున్నది వకటి । మసిలిమసలకున్న మరియువకటి । మూడుజీవులన్న మూలము న్నదియిగిదియె । జీవినజీవి నిర్జీవులివియే॥ ౨౦ ॥ మసలుచున్నదియేది మసలుకున్నదియేది । మసిలిమసలని దానిమర్మమేది । వివరించిదెల్పుమా వినగోరినడిగితి । నాదుమీనురాల మీదువాక్కు॥ ౨౧ ॥ రతులచేరుతువులు రంజిల్లుభువిజీవి । రతిలేకమసలు సజీవులవియె । రతిరుతులువిడనాడి రంజిల్లుచున్న । నిర్జీవులనగవచ్చు నిజముగాంచు॥ ౨౨ ॥ భక్షింపవచ్చేది భక్షింపరాదేది । అక్షయముదెల్పుమా కుక్షికొరకు । పక్షమేలనుజగము విక్షకునవలెనుండి । కక్షకు మపైని కక్షయేలా॥ ౨౩ ॥ ఆంశలెచ్చుదగ్గు ఆలోచనెందుకు । జీవులైనయెడల సజీవులైన । నిర్జీవులనుబట్టి సిద్ధిమిత్యంబున । పట్టిభుజింగవచ్చు పాపమేమి॥ ౨౪॥ భ్రాంతిలేనిజీవి బ్రహ్మంబుసమమనిరి । భ్రాంతిలేనిదాని భావమేమి । భ్రాంతిలేనియెడల బ్రహ్మంబుయౌడనో । బ్రహ్మమనగదాని భావమేది॥ ౨౫ ॥ రతిరుతువులేనట్టి రాజ్యమందుననొన్న । జీవులాగొనుచూడు జీవినీవే । అట్టిజీవైనెడల యెట్టిజీవైనను । పట్టిభుజింగవచ్చు పాపమేలా॥ ౨౬ ॥ యేవిధంబుచుచూడ వేదాంతమువచుండె । పేరులన్ని యేకమబ్ధికడకే। అచలమందురుదాని అనుభవంబెట్టిదో।అంతదెల్పవలయుకొంతగాక॥ ౨౭ రూపులేనిది కాదు యేపులేనిదికదా। మాపుగేపనుమాట మరియులేదు। మొదగదుమెదలదు యెన్నాళ్లుజూచినా । వదలబుద్ధికాదు వసుధయందు॥ ౨౮ ॥ రూపుగలదందురు యేపులేదందురు । విన్నమాటలెల్లా వింతలాయె । యేపులేనిరూపుయే రూపుదెల్పుము । రూపులెన్నిగలవు రూఢిగాను॥ ౨౯ ॥ రూపస్వరూపము రూఢిగావినునీవు । తస్వరూపమన్న తానునీవె । చలనమచలములునీవె అచలచలనమునీవె । సందుదెలసుకుంటె ముందునీవే॥ ౩౦ ॥ రూపులెన్నిగలవు రూఢిగావినిపింపు । చలనమచలమన్న సందుకొరకు । అందమైన మచలమందురుగదధరణి । అం

దమేమిదీని సందుగనక॥ ౨౦ ॥ మాతపిత్రులు రూపుమర్మస్వరూపమే। తస్వరూపమునీవే తత్వమిదియె। మూడురూపులనన్న మూలముగను నీవు। చలనమచలమన్న సందుయిదియె॥ ౨౨ ॥ అచలమన్నదాని అను భవంబిదియని। చెప్పవింటినాదు చెవులయందు। పరిపూర్ణమన్నదే పాదుదెల్పుము వేగ। పట్టుగానుదాని గుట్టుయేమో॥ ౨౩॥ పరిపూర్ణమన్నదే పలువిధంబులనుండు, విధములన్ని నొక్కవిధము జూడ। రాక పోకలందు రాజహంసలు లెక్క। పూర్ణమైన నౌడల పూర్ణమవును॥ ౨౪॥ అచలపరిపూర్ణంబు లసలైననవికావు, అమనస్కమన్నదే అస లునని। సాంఖ్యతారకమన్న సాంగత్యమును దెల్పు। రాజయోగము నకు రాజునీవు॥ ౨౫॥ నోరుకదులువరకు లోకమాతయుకదులు। సాం ఖ్యమనగదాని సారమేమి। సాకారమున్నంత సాంఖ్యమేనని గనుమి। తారకంబుకొంత తరచివినుమ॥ ౨౬॥ తారకంబెరుగను తరచనే నెరుగ ను। తత్వవేత్తనాదు తరముగాదు, తారకంబన్నది యేరకంబన్నది। నీదు నాదురకము నిజముదెల్పా॥ ౨౭॥ తారకంబన్నదె తారకములై నది। యితరరకము లేమి యెంచబోకు। తారకంబన్నదే తనరకంబనిగ నుము। భ్రాంతితారకంబు తనురకంబు॥ ౨౮ ॥ అమనస్కమన్నది అదికూడ దెల్పుమా। విన్నవరకు మిమ్ము విడచిపెట్టా, కన్న లోర్వజాల కడసారి జన్మనా। విన్నపంబులకును విసుకబోక ॥ ౨౯ ॥ అమనస్కమన్నదే అంధకారంబనుమి। ఆపైనిగలదన్న విన్న సున్నా। అమ్మదరిశనమదియే ఆకరన్నది అదియే, రాజయోగమది యే రాకపోకు॥ ౩౦॥ రానిపోని దానిరహస్యము దెల్పుమా। వి నగనాశ్చర్యంబు వింతదోచె। రానిపోని దాని రాకపోకలుయెట్లు। రాజయోగులకును రాకలెట్లు॥ ౩౧॥ వీనులున్నవరకు వినుటమాత్ర ముగాదు। కన్నులున్నవరకు కనుటగాదు, నాసికంబుకట్టి నడత లెరిగి నవెనుక। ఆత్మయందైనన్నదమనస్కము॥ ౩౨॥ మొట్టమొదటా లాగు చిట్టచివరలాగు। నట్టనడుమ నుండునడత లేమో। శాస్త్రసమ్మత సమ్మతముగా। చెప్పగోరితినయ్య। కోపగింపబోక కొరతదీర్పు॥౩౩॥ నట్టనడుమనువుండే నడతలడిగితివికను, అడుగకుండ చెప్పనలవికాదు

యేధర్మమడిగితే ఆధర్మమేగాని । వరసలేదు దానికసలులేదు ॥ ౮౪ ॥ షడుశాస్త్రములువల్ల సార్థకంబేమిటో । చెప్పవలెనుదానికు ప్తమెల్లా అసలుగాని వాటిననుసరించితినని । ఆత్మలోన అస్యమాడబోకు ॥ ౮౫॥ అసలుగావనరాదు అసలవియెననరాదు । అసలుగన్న వారికసలుకసలు అసలుగానకుంటె అసలేదిసిసలేది । అసలేలేవియెక్షల అసలునివియే ॥ ౮౬ ॥ కుభ్యగోపురములు గోపిందునామంబు । పుల్లమదరగాను తె ల్లవార ॥ యెల్లపూజజేసి యేమిఫలమందెదరో యెరుకజెప్పవయ్య వేడుకలరా ॥ ౮౭ ॥ పూర్వకృతమునల్ల పుడమిలోపుట్టిరి । పుణ్యాత్ము లై మళ్ళపుట్టుకొరకు । అట్టిపూజలుజేసి ఆనందమొందెదరు ఆత్మవిద్య గాదు అందమిలను ॥ ౮౮ ॥ అష్టాంగయోగముల్ । నిష్టలుచే కొందరె ష్టిసమిష్టినిలయెల్లదిరుగ । కష్టసుఖమేమిటో కర్మవశమేమిటో । స్పష్ట ముగను దానినష్టమేమో ॥ ౮౯ ॥ అసలుదందకిదాని నందందుశాకలె అష్టయోగములందు నష్టమేమి । లేనుగాని దానివల్లలాభము లేమి । ముం దుగాని ముఖ్యమిందులేదు ॥ ౯౦ ॥ హరికథలుచేకొంద రానందమొందె దరు । అందుఫలితమేమి అరసిచూడ । సంగుదెల్పుదానిఅందమంతయు విందు । యింకాగానెమిమ్ము నడుగుచుంకు॥ ౯౧ ॥ హరికథలుచేకొంత అరమపునుదమ్కర్మ । కాని సుకర్మదదికాంగు కాగు । వుదరపోషణకు నై పృథివిచనువరులైరి పుట్టిగిట్టుటకును పూజకాంగు ॥ ౯౨॥ కాశి రా మేశ్వరముల్ కాసులువ్రయపెట్టి । పూటకూళ్ళకుబోయి పుణ్యమనుచు నోటికట్టును గట్టినోములునోచిన । వారిఫలితమేమివసుధయందు ॥౯౩॥ కాళ్లుతీపులుబుట్ట కాసులువ్రయపెట్ట । పూర్వకృతమట్లుగా పృథివియం దు కాని ముక్తికియిందు కాసింతయునుందు లేశమైననందు లేదునందు॥ ౯౪ ॥ దానధర్మములచే దయశాలులందురు । అందుఫలితమేమి ఆ య్యచెపుము । కొందరంధులైరి కొందరానందులై । పుండురయ్యయిల ను యిదియుజెపుమా ॥౯౫॥ దానమన్నదివేరు ధర్మమన్నదివేరు । సం దుగానవలెను అందముగను । దానధర్మమునందు దాక్షిణ్యములువేరు ద్రవ్యమొక్కటైన దారివేరు ॥ ౯౬ ॥ ఆనందుదెల్పుమా ఆనందమా నంద । మొంది మిమ్ముకోరివేడినందు ॥ యెందునేమున్నదో యెరిగింపు

వేగమే, యిందుగాని చెవులనిందునందు ॥ ౯౭ ॥ అడిగినప్పుడుయివ్వ
మదిధర్మమనవచ్చు । యివ్వగోరి యివ్వదాననునుమి దానధర్మమునం
దు ద్రవ్యమొక్కటిగదా । దారివేరుగాదథాత్రియందు ॥ ౯౮ ॥ ద్ర
వ్యవంతులు కొందరాద్రవ్యవంతులు యిందులేనివారు కొందరయ్యా
వుందురయ్యా ధరను యెందుచేతనోగదా । సందుదెల్పవయ్యా వింపు
నయ్యా ॥ ౯౯ ॥ పెట్టిపుట్టినవారు పెట్టుగొట్టినవారు । పెట్టగోరిపెట్టలే
నివారు, పెట్టవుండి పెట్టలేనట్టివారిట్టు । పుట్టిరయ్యయిలను యిట్టుల
నుమి ॥ ౧౦౦ ॥ అహా శాబాషయ్య అప్పనయ్య నాయయ్య, యెంత
వారలయ్య యోచిచూడా ।యింకనినొక్కటి పెంకిమాటడిగెద, శంక
చాయబోకు శంకదీర్చు॥౧౦౧॥యిన్నింటికింకొక్కటి తంపైవుంటేనుపెం
కేదోవంకదో శంకలేల, మనసుత్తృప్తిదీర మాటలాడకగాని, మార్గమది
యుగాదు మనుజులకును॥౧౦౨॥ పరస్త్రీలగమనంబు పాపమందురుగదా
పట్టుగాను నాదుపామరంబు । యిట్టిమాటని మీరుగట్టిశాయగబోక,
గుట్టుదెల్పవలెను గట్టిగాను। ౧౦౩॥ తనయాలిచేష్టలు తాదెల్పకుంటే
ను । పరస్త్రీలనగరాదు పాపమేది । తాతప్పెరిగిన పరతప్పెరుగని
అట్టివారికెల్ల గట్టితప్పు॥ ౧౦౪॥ గురుశిష్యులన్నట్టి గురుతడుగమరచితి,
యిదియుదెల్పుమింక నడుగబోను, అడగినదంతయు ఆనందమాయెను,
అడుగలేనుమిమ్ము నడుగలేను॥ ౧౦౫॥ చెప్పసక్యముగాని చెవుశిష్యుడు
సుమా । లోకమేలగల్గు నోరుగురువు । వినచెప్పలేనట్టి ముక్కుముఖ్య
ముగదా । కన్నులున్నవరకు కలనుజగము॥ ౧౦౬॥ మానంపుండై నె
డల మార్గమడిగితిగదా । యితరజీవులకును గతులుయేమి । సతులుసు
తులున్నట్టి సారమెయెరుగవు । మతులుగానలేవు మర్మమేమి॥ ౧౦౭॥
యితరమన్నది నీవే నీవన్నదితరమే, యిందుతప్పినెడల అందునీవే అం
దుదప్పినెడల యిందుననీవన్న । సందుగానవలెను మందమిడచి॥ ౧౦౮॥
ఆసందుదెల్పుమా ఆనందమాసింక । అందునిందునన్న అందమేమో ।

యిందునందున వక్కాణైనందు సందేమో । ఆందమంతదెల్పు ముం
దుగానె॥౧౦౯॥ యిందుజేసినతప్పు లందుఅనుభవమందు । శిక్షలనగానదే
సృష్టిలోనశిక్షదీరినవెంట్ర సిష్టినీవేనంట,తంటదీర్పుమంటగక్షకంటా॥౧౧౦
సరిమిమ్ము యింకొక్క శాస్త్రసమ్మతమైన । మాటనడుగబోయి మరచి
యుంటి । యెష్టిసమిష్టన్న యెద్భావమెట్లనో । తద్భావమెట్లనో తత్వవే
త్త॥ ౧౧౧॥ యెష్టిసమిష్టన్న దేలోకమున లేదు । వృప్పరాదుదాని ముప్పు
గాని । కుడియెడమలున్నట్లు కూడియున్న దెకాని । వక్కాణింపరాదు వ
క్కానాడు॥ ౧౧౨॥ తల్లిదండ్రులు సన్న తమ్ములుచెల్లెండ్లు । ఆలిఅక్కన్న
ట్టి అర్ధమేమి । శ్రద్ధతోనుదెల్పు ఆశ్రద్ధశాయకు । అంతరాత్మ నీదువిం
తలన్ని॥ ౧౧౩॥ సంతకూటంబన్న సంసారమందున్ను । సారమన్నదున్న
సాగదున్ని । యిల్లువళ్లుమరచివల్ల జూచినవల్ల । కల్లగాని వీరలెల్లనిజ
మా॥ ౧౧౪॥ కైలాసమని బ్రహ్మపట్నమందురుగదా । వైకుంఠమన్న
దేవైపునుండు। వరసజెప్పుమునీదువరహాలుమాటలు, మాటగట్టుకుం
దాముద్దులాడా॥ ౧౧౫॥ భ్రమగల్గుచోటనే బ్రహ్మపట్నంబుండు । కై
లాసమన్నదే కదలుచుండు । యోనికుంటకుబోవకుంటె వైకుంఠము ।
వరస మూడుగలసి యాకముండు॥ ౧౧౬॥ వేదాంతమన్నందు
యేమిలేదన్నందు । మిమ్ము నడిగినందు మీదిసందు । విన్ననందు
మదిని ఆనందమేమందు । దాసునందుమీకు దాసవర్యా॥ ౧౧౭॥
లేదన్న దేమీదు మీదన్న దేకిందు । కిందుమీదుదెలసిన మందమి
డచి । అందమైనదాస మందిలో సవిట్లు । సందుదెలియనట్లెసంచ
రించు॥ ౧౧౮. అందమేమెరుగను సందులేమెరుగను, కిందుమీ
దుదెలియ నందుడయ్య । చేరిమిమ్మడిగితి చెప్పిరినామనము, సాక్ష్య
యుంటిమీకు చిక్కితయ్యా॥ ౧౧౯. చొక్కటమన కేల చిక్కటమన
కేల, సరిసమానముగదా సరసమిదియు, యితరులెవ్వరిట్టి హితవు
లుకోరిన ! కోరినట్టివారి కితవులవును॥ ౧౨౦. సతములు లేనట్టి యి

తప్పులుమనకేల । యితరులెవ్వరన్న సతములేల । దాసులౌమీరు మీ దాసోహకునినేను । దాగియుండనాను దాపుమీరు॥ ౧౨౧. ద్విపద. వినుసహోదరనీకు వినుపింతునొకటి । యిత్తులేనిదిపంట విశ్వమం తయును । పంచభూతములాయె ప్రాపంచమాయ । యిత్తులే దననరుల కితపుగాబోదు । యిత్తున్నదనుమాట వినుపింపవలెను, మ త్తుచేజగమంత మరచియున్నదియె । మత్తుమరచినవారు మహనీయులై రి । యిదిముముక్షుత్వంబు యిదియెఅయిక్యంబు । యివిగాక వేరొకటి వినుమయిటుపైని । వేదాంతమన్నదె వెర్రిభ్రమగాని । ఆదిలేనిదిదాని పాదుయేలేదు । పామరత్వముచేత పలువిధంబులను । పరికించిచూడగా ప్రబలమైవున్న । వేదశాస్త్రములనే వెతలుకొన్నాళ్లు । కతలుచేకొ న్నాళ్ళు కలియుగంబునను।సతిసుతులుచుట్టాలు సంతకొన్నాళ్ళు। యీ రీతియీయుర్వి యుగప్రమాణంబు । జరిపేటివారిలో జాలికొందరును । నొందియీజగమందు నుంహరేకాని । అచలప్రభావంబు ఆత్మనూహిం చి । అంతరాత్మునియందు చింతనూహించి । చింతచేకొన్నాళ్ళు వింత లనుజూచి । వింతలన్నియుజూచి అంతులేదనుచు । విరవీగుచుకొంద రెర్రులై పోయె । విశ్వమంమున్నట్టి వింతచింతలను । వంతువంతులు గానె అంతుయిదియనుచు । ఆనందమునుబొంది అంతమిదియనుచు । అంతమన్నటుపైని వింతేమిలేదు। వింతచింతలుఅంతు అంతమంతయు ను । యింతియేకానియిక యెంతోలేదనుమి । పుట్టిగిట్టడమనగ పూర్వ జన్మనగ । ముందుదికముందనగ యిందుదిదిననగ । పాపపుణ్యములనగ పరమాత్మయనగ । సందుగనుమన్నట్టి సందదేకాని । అందమేకలియుగ ప్రభందమేకాని । నేనన్ననీవన్న నిజమున్నదన్న । వున్నదివున్నదే యు గయుగంబులను । నీవునేనొకటైతె నిజమనగవలెను । కానిరతిరుతుల చే కపటంబుగలదు । పోతుపెంటికిమధ్య పేరొకటిగలదు । యిత్తది యె స తదియె సా తదియెగనుమి । మొతమెజగమంత మోయుటె

ననుమి । వృత్తదేననుగనుమి అత్తివున్నదియె । లోబయులుయాకనై లోకమంతయును । యేలిక్తై వున్నది యోగులందరికి । వచ్చిపోయెటి వారి కసలదియుగాదు , రానట్టివారికి రహస్యమే యిదియు । యిదిగాక యింకొకటి యిహమందునగలదు। నానాభ్రమలుచేత నరుడెగురుడనుచు కారణంబనికొంత కాలంబుగడువ । సాంక్యతారకమనుచు సాధనంబనుచు , అమనస్కమనికొంత ఆనందమునను , అచలమనికొంద రానందమునై ధరను । పరిపూర్ణమనికొంత పలువిధంబులను , యెట్టిగాకను సమిష్టనుచుకొందరును । తల్లక్రిందుగబుట్ట తప్పుగానకను , తలముందమొలముందయని తర్కమునను । తంతుజరుపుటెగాని తాత్పర్యమేది, అంతుగనుగొనువారి కసలెట్లునంగ । సాకారమున్నంత సాంక్యమేననుమి । తనువక్కటున్నదే తారకంబనుమి , ఆంత మింతేనన్నదమనస్కమనుమి। అభిమానముడిగితే అచలమదిననుమి । లోబైలు సమమైతె లోభమేమికను । పరిపూర్ణ మన్నదే పట్టశక్యంబా । సాకారములనున్న ఆకారమదియు। యెట్టియచ్చటజూడ యేర్పాటులాయె । కాకసమిష్టన్న కడసారిమాట। తలమొలకుముందుగా త్వంపదంబనుమి । యీరీతిజరుపుటె యుగప్రమాణంబు । కానివారితోనీకు కలహమికనేల । బుద్ధివంతులతోడ బద్ధిశాయకను । బాధ్యమై జగమంత భావింపుచుండు । అడిగినందుకునీవు ఆసించినందు। మర్మమేమియు లేక మార్గమునియున్న। వున్నంతజెప్పితిగ యిట్టి పైనిసున్న॥ ౧౨. ద్విపద. అయ్యనామనవకటి ఆలింపుమన్న । అన్నయ్యవనరాను ఆశరాత్పరుడానరుడవు గురుడవు నరహరేసివు , యేజన్మమునందొ మొంచి జేసినదో , యీజన్మమందునయి వెవానపల్లి। సన్యాసిదానుడై సద్గురేణ్యుడవు। నిలచియున్నందునే నిలవునేగోరి । పింటిని మీవల్ల యిలమర్మమెల్లా। దంటబాయగలేను దైవమేమీరు । వినిపించెనంతనే వింటిసరిగాని । అసలుజెల్పితిరినా కానందమాయె । మీరన్న మాటకు మీదను

న్నన్న । ఆసందు దెల్పుమా అనందమవును । యిర్గ్రుండగా దాని అందమే సుయ్యా॥౧౭౩॥ ద్విపద. అయ్యయో నే నెన్ని యోచించి జెప్పినను । అనుమానమే గాని ఆనందమేది । ధరనుపోతాబత్తు లప్పలస్వామి । అడిగినందున నేను ఆనంద మొంది । నాశిష్యసమముగా నలువిధంబులను నేనెరిగినంతనే నికెరింగించి । సరిసమానముగా నే సర్గోష్టి యిదియు । స్వప్నజాగ్రత సుషుప్తవస్థలను యోచి। యిహమున్న పరమున్న అయిక్యమన్నదియు । ఆమాటయందు నే యీనురాడుగినుమి । యోచించినంతను యోగాలుగలవు । యోగాలెన్నో యారోగాలుకొంపా । రోగాలు చేతనె రావాడుగాని । రాకపోకలు కట్టె రహస్యమెరుగనుగా । కాబట్టి యిటుపైన కాసింత యయిన। సందేహముచెంక సహజన్మమనుమి । సందేహవేమనకు సర్వకాలంబు। సాకారములయందు సంచరించునుగా। గనుకయిటుపైసిప్రగడియమాత్రంబు। వేరొక్కటున్నదని యోచించబోకు॥౧౭౪॥ గీ॥ తెల్లవారగానె తొలిసరణుమీ కెప్పుడు। అంనునందద నుచునింపుప్రాప్తి । సందు దెల్పినట్టి సద్గురుడ వేనిప్పు । వుండురయ్య గుసువులెందరైన॥౧౭౫॥ ఆయురారోగ్యముల్ అయిశ్వర్యములనొంది । అయిక్యపదవిగనుమి అంతమునకు । సంతకూటమునున్న స్వాంతభుద్ధులుమాని। జ్ఞానమన్నదాని జ్ఞాపకమున॥౧౭౬॥ చెప్పవింటిగాని చెవులపండువుగాను । లేచివెళ్ళబుద్ధి లేదబోదు చేయిబట్టి లేవదీయు । గోరితినయ్య చంటిపిల్లవలెను చంకపట్టి॥ ౧౭౭॥ లేచివెళ్లుటకను లేతబుద్ధిది గాదు । గాథమైనదనుచు గారవిస్తి । పెద్దలన్నయెడల రద్దిశాయగబోకు । కొద్దివారలయిన నద్దికికను॥ ౧౭౮॥ వచనము. అయ్యా యీప్రపంచనడతలు అనేకవిధములు. వేదశాస్త్రములు అనేకవిధములు. పెద్దలమాటలు అనేకవిధములు. మీరు చెప్పినది వకవిధము యీనాలుగువిధములలో యేవిధముజూచిన ఉచితము. కాబట్టి మీరు చెప్పినప్రకారమే నిశ్చయించుకుంటిని. కాని యితరము లేదు.॥౧౭౯॥

వచనము. స్త్రీకాని ఆమాటలనబోకుమా యేమంటే యీప్రపంచతంతు గ్రహించుటమే అంతు. వారే పెద్దలు అంతు గ్రహించటమే అంతముకాని వేరేలేదు ॥ ౧౩౧ ॥

సహోదరసంభాషణ సంపూర్ణము.